# మనవి

ఎన్నోఏండ్ల కృషిఫలితంగా శ్రీ పొట్లపల్లి రామారావుగారి ఈ గేయాలు అచ్చులోకి తేగలిగాం. సుమారు 20 ఏండ్లనుండి వారు రచనలు సాగిస్తున్నా, అవి గ్రంథరూపం ధరించడానికింత కాలంపట్టడం దురదృష్టమే. కాని ఈనాటికైనా గ్రంథరూపంధరించినందుకు ఆనందముతో ఉబ్బిపోతూ పాఠకులకు అందిస్తున్నాం. మా కృషి ఫలింపజేసిన శ్రీ పొట్లపల్లి రామారావు గారి కెంతైనా కృతజ్ఞులం. "ఆత్మవేదనను గురించి నా గొడవ" వ్రాసిఇచ్చిన శ్రీ కాళోజి నారాయణరావు గారికి మా ధన్యవాదాలు. గ్రంథమాలకు అన్ని విధాల సాయపడ్తున్న దేశీయులకు మా నమస్కారాలు.

*దేశోద్ధారక గ్రంథమాల*

సికింద్రాబాదు,

20-5-57.

విన్నవించు

వట్టికోట ఆళ్వారుస్వామి.

స్థాపకుడు & ప్రకాశకుడు.





శ్రీ వి. ఆనందరావుగారు.

సికిందాబాదు

వీరు గ్రంథమాలకు రు. 105 లు
విరాళం ఇచ్చారు.



శ్రీ కె. వి. భీమసేనరావుగారు

అప్పన్న పల్లి

వీరు గ్రంథమాలకు రు. 116 లు
విరాళం ఇచ్చారు.

వీరికి మా హార్దిక కృతజ్ఞత లర్పించుకుంటున్నాం.



# ‘ఆత్మవేదన’ను గురించి ‘నా గొడవ’

స్టేటుకాంగ్రేసు సత్యాగ్రహంతోపాటు ‘నా గొడవ’ రామారావు ‘ఆత్మవేదన’ ప్రారంభమైనాయి. ‘నాగొడవ’ ఎప్పటికప్పుడు నలుగురి చెవుల్లో పడుతూవచ్చింది. ‘ఆత్మవేదన’ రామారావు ఆత్మవేదనగానే ఉండిపోయింది. సన్నిహితులకే అజ్ఞాతంగా ఉంటే మరి ఇతరుల సంగతి అడగపనిలేదు.

బెంగాలు విప్లవకవి ఖాజీనజరుస్సలామ్ వలెనే రామారావు పల్లెటూరి వాడు. చదువుకై పట్టణం వచ్చినా ప్రారంభ దశలోనే విద్యకు స్వస్తిచెప్పి ఊరు చేరుకోవలసి వచ్చింది. 1914 లో ప్రారంభమైన ప్రపంచ సంగ్రామంలో సైనికుడుగా చేరి రణరంగంలోని భీకర వాతావరణంలో జీవితం గడిపిన నజరుస్సలామ్ మనసు ఏఏ పరిణామాలకు గురైందో కాని అతడు యుద్ధరంగంనుంచి కవిగా స్వదేశం చేరుకున్నాడు. రామారావు వరంగల్లులో సత్యాగ్రహం చేసిన మొదటి జట్టులో ఒకడు. జేలునుండి తిరిగి బయట పడే నాటికి అతడుకవి.

రామారావు కథలు, నాటికలు, నవలలు, పద్యాలు, గేయాలు, జాబులు వ్రాసినాడు. అతడు వ్రాసిన సైనికుని జాబులు, రెండో ప్రపంచ యుద్ధంలో పాల్గొనుటకై తన ఊరు, బంధువులు, మిత్రులు అంతేకాదు తన ప్రేయసిని వదలి కేవలం పొట్టకూటికై సైనికుల్లో చేరిన అమాయకుడైన పల్లెటూరి నవయువకుని మనో భావాలను ప్రకటించునవి.

రామారావు నిరాడంబరుడు. సభలు సమావేశాలు, ఉపన్యాసాలు, కావ్యగానాలు, అధ్యక్షతలు, ప్రారంభోత్సవాలు మొదలగు వానితో



అతనికి సంబంధము తక్కువ. గడచిన పదిహేను సంవత్సరాలలో ఒకే ఒక కవి సమ్మేళనానికి అతడు అధ్యక్షత వహించినాడు. రెండు కవి సమ్మేళనాలలో మాత్రం తన ' ఆత్మవేదన ' వినిపించినాడు. అదైనా ఎంతో బలవంతం చేస్తేనే. తన రచన పత్రికల్లో ప్రకటించుకుందామనే ఉబలాటం కూడా లేదతనికి. ఈ కారణాలవల్లనే ' నాగొడవ ' తో బాటు వెలువడినను రామారావు ' ఆత్మవేదన ' పుస్తకరూపం దాల్చుటకు ఇన్నాళ్ళు పట్టింది. దానికై ఆళ్వారుస్వామి భగీరథప్రయత్నం చేసినాడు. స్వామిది ' మకరపట్టు '. అతని పదేండ్ల ప్రయత్నం ఫలించింది. అయిష్టంగా నైతేనేం రామారావు తన 'ఆత్మవేదన' పొత్తం చేయ సంకల్పించిన స్వామికి అడ్డుపడడం మానుకున్నాడు. ' సరే నీ యిష్టం ఏమైనా చేసుకొమ్మ ' ని ఆళ్వారు స్వామికి తన ' ఆత్మవేదన ' నప్పజెప్పుతు అప్పటి తన మానసిక పరిస్థితిని చెప్పుకొన్నాడు రామారావు. ' ఆత్మవేదన ' ప్రారంభంలో ' వికసింపని ఈ మొగ్గను—పిసికి తెంచి అన్నారు ' అనే గేయం అది.

రామారావుకు కాళోజీకి, వారిద్దరితో తనకు ఉన్న ఆత్మీయతను బట్టి ఆళ్వారు స్వామి అన్నాడు, " కాళయా 'పరివేశిక' బాగానే ఉన్నది కాని రామన్న గేయాల సంపుటిలో అతన్ని గురించి నీవు నాలుగు మాటలు వ్రాయక తప్పదు." అందుకే 'ఆత్మవేదన'తో ఆత్మీయత చేసుకొనుటకు ముందు 'నా గొడవ' వినక తప్పింది కాదు మీ అందరికి.

'ఆత్మవేదన'తో కాళోజీకే మొదటి పరిచయం. 'నా గొడవ' రామారావు విని అప్పుడప్పుడు 'ఆత్మవేదన' వినిపించేవాడు. రామారావు 'ఆత్మవేదన'ను 'నా గొడవతో' బాటు నేను నలుగురికి వినిపించేవాణ్ణి. నా బలవంతం వల్లనే మిత్రులకు కూడా వినిపించేవాడు 'ఆత్మవేదన'ను



అప్పుడప్పుడు రామారావు. అఖిలాంధ్రమునకు చెందిన కవుల గేయాలను ఆంధ్రావనిలో నాలుగు మూలల వినిపించుటకై మ్రోగిన 'ఉదయ ఘంటల'లో రామారావువి కేవలం మూడుగేయాలు ప్రకటితమైనాయి. 'నా గొడవ' మొదటి ముద్రణలో 'గగనలక్ష్మి' అనేగేయం నాకు దత్తువచ్చింది. అదిఅసలు రామారావుది. 'నా గొడవ' కు 'ఆత్మవేదన'కు సంబంధం అట్లాంటిది.

'ఆత్మవేదన' లోని ప్రతిగేయం రామారావు నోట విన్నాను. నేను స్వయంగా ఎన్నోసార్లు చదువుకున్నాను. మిత్రులకు ఎన్నోసార్లు వినిపించినాను. అసలు రామారావునే చాలాసార్లు చదువుకున్నాను. ప్రజలకు నిరంకుశ ప్రభుత్వానికి మధ్య జరిగిన పోరాటంలో పాల్గొన్నాక రచయితగా మారిన రామారావు తిరిగి చదువు ప్రారంభించినాడు. దానికై అతడు బడిలో చేరలేదు. మిత్రుల ఇండ్లలో, గ్రంథాలయాలలో ఏ పుస్తకం ఉన్నా రామారావు దాన్ని చదవకుండా విడువలేదు. తెలుగు, హిందీ, ఉర్దూ, ఇంగ్లీషు భాషల్లో ఉన్న వందలుకాదు వేలకు వేలు పుస్తకాలు ( కథలు, నాటకాలు, నవలలు, కావ్యాలు ) రామారావు చదవడం నేనెరుగుదును. హనుమకొండ- మట్టెవాడ, (వరంగలు) లో ఉన్న గ్రంథాలయాలన్ని 'ఆపోసనం' బట్టి కేవలం పుస్తకాల కొరకు రెండేళ్ళ పాటు హైద్రాబాదులో ఉండి రెడ్డిహాస్టలు గ్రంథాలయం లోని పుస్తకాలేకాక స్టేటు లైబ్రరీలోని పుస్తకాలను కూడా చదివినాడు అతడు. మిత్రులతోపాటు కూర్చున్నప్పుడు గూడ మాట్లాడడు. అందరి మాటలు జాగ్రత్తగా వింటాడు. వినడం చాలనుకుంటే ఒంటరిగా బయలుదేరి వెళ్ళిపోతాడు గుట్టలు చెట్లనడుమ వాహ్యాళికి. గంటలతరబడి అక్కడ ఒక్కడే కూర్చుంటాడు. పిట్టల మాటలువింటూ, బుసకొడుతూ పరుగెత్తే పాములను జూస్తూ, చీమలబారును పరీక్షిస్తూ ఉంటాడు.



పుస్తకాలు చదవడం, ప్రకృతిసిద్ధమైన చక్కదనాలను చూడడం అంటే ఎంతో సరదా రామారావుకు.

రామారావు ప్రపంచపౌరుడు. అతడు విశ్వకుటుంబి. రంగు, రూపు, దేశంవేషం, భాషా సంస్కృతి మొదలగు వాని పేర పాటించబడే విభేదాలేవి పాటించేవాడు కాడు అతడు. అందుకే అతని 'ఆత్మవేదన' మానవ మాత్రుల 'ఆత్మవేదన'గా తయారైంది. ఛందశ్శాస్త్ర సంపన్నులు, వైయాకరణులు, భాషావేత్తలు, అలంకార శాస్త్రజ్ఞులు, సంప్రదాయ భక్తులకు కూడా 'ఆత్మవేదన' తప్పక నచ్చుతుంది వారు మానవులే కాబట్టి. మానవునితో రామారావుకున్న ఆత్మీయత అటువంటిది. ఈ ఆత్మీయతను పెంపొందించి విశ్వమానవ సౌభ్రాతృత్వం నెలకొల్పితేనే కాని ప్రపంచ శాంతి చేకూరదని అతని దృఢవిశ్వాసం. పంచశీల సూత్రాలకు ఈ నడుమనే ఎక్కడలేని ప్రసక్తి వచ్చింది. అవి విస్మృతిలో ఉన్నకాలంలోనే వాటిని తన 'ఆత్మవేదన'కు పునాది చేసుకొన్నాడు రామారావు.

'ఆత్మవేదన'ను అందరికి అందిస్తున్న స్వామి ఆత్మీయతకు జోహారులు. 'నా గొడవ' ఓపికతో చదువుకున్న మీ ఆత్మీయతకు కూడా జోహారులర్పిస్తూ రామారావు 'ఆత్మవేదన' చదువుకుంటే మానవుని ఆత్మవేదన గుర్తుకొస్తుందని మీకు హామీ యిస్తూ 'నాగొడవ' ముగిస్తాను.

హైదరాబాదు
16-5-57

కాళోజి



# రచయిత పరిచయం



జననం : 1920

చిరునామా : తాటికాయల,

'పోస్టు' పెదపెండ్యాల, వరంగల్.

కార్యకలాపాలు : వ్యవసాయం.

అభిరుచి : సారస్వతం.

రచనలు : ముద్రితం : జైలు (కథానికలు)

కథలు, గేయాలు. పత్రికల్లో.

అముద్రితం : సైనికునిజాబులు, తరంగాలు, నాలోనేను.

కథానికలు, నాటికలు.

అభిమాన రచయితలు : గోర్కీ, పెరల్ బక్, విలియం సారాయన్,

రోమారోలాన్, టాల్‌స్టాయ్, పోతన, రాయ

ప్రోలు, చలం, ప్రేంచంద్, కిషన్‌చందర్.



వికసించని ఈ మొగ్గను
పిసికి తెండి అన్నారు
అంగడిలో పెట్టండి
అమ్మండి అన్నారు.
ఎన్నాళ్లు ఎదిరిచూపు !
ఏమి లాభ మన్నారు ?
భయాన తన లోలోపల
పలుమారులు కంపించి
నిశ్శబ్దముగా రాలెను
నీదు పాద సన్నిధిలో.



## చూదాము

ఎవడు ఇక్కడ రైతు
ఎవడు ఇక్కడ రాజు
కష్టించు వారొకటు
కాజేయు వారొకరు.

భూదేవి! నాగటికి
పాదివ్వ బోకు
వరుణదేవా! నీవు
కురియబోకయ్యా
విత్తనాలు! మొలక
లెత్తబోకండి
నదులార! మీరింక
కదిలేరు సుమ్మీ
సాగరా! నీవింక
స్తంభించి పొమ్మా
గాలిదేవ! నీవు
కదిలేవు తండ్రి
కోడె గిత్తల్లార!
కాడి కందేరు
కష్టజీవి! నీవు
కడతొలగ వయ్యా
చూదాము! ఈ ప్రభువు లేమేలుతారో!
చూదాము! ఏ ప్రజలు పన్నులిస్తారో!

## రాజులుండేమి ?

మన్ను దున్నె
మిన్ను కురిసె
చేను మొలచె
చిగురు లేసె
కంకు లేసె
కాపు కోసె

పభ్రువు లే దపుడు
పన్ను లేలిపుడు ?

ఉఱుము మెఱుములు
వరదవానలు
కాళరాత్రులు
కడుపుమంటలు
కంటశోకము
ఇంటదీపము
లేనిరోజుల
కానిరాజులు

యిప్పుదేమిటికి ?
ఎవరివేకటికి ?

పచ్చపచ్చని
పైర్లుసాకె
మబ్బుతునకకు
మారుతమునకు
వానచినుకుకు
వరదజాలుకు

ప్రభువులేమిటికి ?

పన్నులేమిటికి ?

ఘర్మజలము
కండ బలము
కంటి నీరు
ఒంటి నెత్తురు
కాన్కవెట్టి
గడనచేసిన
ధాన్యరాసుల
తస్కరించే

రాజులుండేమి ?

రాజ్యముండేమి ?

## ఖైదీ

మానవుని హస్తాలి
దానవుని రూపెత్తి
దానవుల పహరాలో
మానవుడవై ఏడ్చు
అజ్ఞాత జీవివో !
అసహాయ జీవివా !
మానవుడ వీవోయి
మావాడవేనోయి
ఏనాటి బంధమ్మురా !
ఇపుడెట్లు తెగిపోవురా !
మనిషివై నందు కీవే
దౌ నేరము చేయ
అంత మానవులపే
అనుమాటయే మరచి
ఉక్కు గొలుసులు పేని
ఉరికొయ్య నాటించి
నిలువుగోడలు కట్టి
నిన్ను ఖైదిచేసి
దివ్యులై పోయారురా !
నీవారలే చూడురా !

నేరాలు చేయుటకు
నీవె పుట్టగలేదు
వెలుగు దోపిడిగాళ్ళు,
నిలువు దోపిడిగాళ్లు,
రక్తాన్ని చిందించు
రాజ్య తృష్ణాంధులు
దేవతల రూపాన
తిరుగుతున్నారోయి

పైకంటి కగపడదురా !
లోకంట చూడాలెరా !

చాటేమిటిక జగమె
కూటిపేదల జేలు
దాస్యమే సంకెళ్లు
దారిద్ర్యమే నేర
మవని బీదల కష్ట
ఫలరాసులను మ్రింగు
ధనమదాంధుల భోగ
తృష్ణ పోయిననాడె

ఉరితాళ్ళిదు తెగిపోవురా
చెఱసాల పడిపోవురా !

# గగనలక్ష్మి

గగనలక్ష్మి కరగి
కంట జార్చెడి నీరు
రైతుబిడ్డడు నలిగి
రాల్చు చెమ్మటజాలు
అణువణువు బిగ్గగా
ఐక్యమై ప్రవహిస్తె
సాగరుడు భరియించునా?
స్వర్గవీథులు నిల్చునా?
మండునిప్పులు రేపి
మాడ్చు వేసగిగాడ్పు
రైతుగుండెల నలిగి
రగులు ఆకలిఊర్పు
కోడె త్రాచులవోలె

కోరలే తీసెనా
ఘాతాలు కనిపించునా?
భోగాలు ఇక నిల్చునా?

రక్తమ్ము బలిపెట్టి
రైతు కూర్చినసొత్తు
ద్రవ్యార్జనంబుకై
ధనికుడేసిన ఎత్తు
బీరుపోకుండగా
ఏరి రాసులు పోస్తె
ధర్మదేవత ఏడ్వదా?
ధరణి గడగడ లాడదా?

మండిమండి అగ్ని
పర్వతమె పగిలెనా
విసిగి నలిగి రైతు
విప్లవమె వచ్చెనా
పాత గోడలు కూలి
రైతు సంకెళ్లూడి
కొత్త లోకము పుట్టదా?
కొత్త గాడ్పులు వీయవా?

# నిస్పృహ

ఎందుకు నాకీ ఎముకలబోను?
ఎవరోయి ఆ బలసినమ్రాను?
ఎవడిచ్చెను ఆతనికధికారం?
ఎందుకు నాపై బానిస భారం?
ఎందుకు ఆతని కా అమితాశ?
ఏమిటి నా బ్రతుకంత నిరాశ?
ఏదీ నా కష్టార్జిత భాగ్యం?
ఎక్కడిదీ అతనికా స్వర్గం?
దేవుడు ధర్మము నీ నాలుకపై
తీరని వేదన నా కాకలికై
చెమటోడ్చియు తలవంచుటకేనా?
జీవించుట ఇది మనుగడయేనా?
ఎవడేడ్చిన ఈ తలబరువోయి?
ఎందుకు మీ పాలన మాకోయి?
ఎందుకు ముసుగులు ఎందుకు తెరలు?
తెలసినవయ్యా మీ గుసగుసలు.

# చీకటి

జీవితమంత
చీకటి చీకటి
వెలుగున్నను కను
పించును చీకటి
జీవితమె యిక
చీకటి అయితె

ఎందుకురా ఈ జీవనము?
పందులమా ఇటుమనుటకు మనము?

మండే ఎండలు
మొండి వర్షములు
గాలి దుమారాల్
కాటక బాధలు
సమస్త కష్టాల్
చావు బ్రతుకులు
మనపై ఎప్పుడు
మనపై నప్పుడు

ఎవనిదిరా ఇంకీ జగము?
ఏటికిరా ఇటు బ్రతుకుట మనము?

మన కష్టార్జన
మనహితచింతన
మన నిష్కామము
మన సర్వస్వము
మరల రూపమున
దొరల రూపమున
మన నెత్తురులే
మరి పీల్చినచో

ఎందుకురా ఈ గతి శ్రమలు !
ఏటికిరా మనకీ భ్రమలు !

ధనిక దరిద్రుల
తారతమ్యమే
విశ్వమంతయు
వైషమ్యాగ్నిని
రేపుచున్నది
మాపనున్నది !

ఎవడోపునురా ఈ గతిని !
ఎవడార్చునురా ఈ చితిని !

# ఎన్నాళ్లు?

ఎన్నాళ్ళు మోయమీబరువు
ఎన్ని యుగాలింక గడువు
మోసి మోసి బరువు
వేసారి పోయితిమి
పేరు పెంపులేక
వెనుకపడి పోయితిమి
కూలబడి పోయితిమి
నేలబడి పోయితిమి..........ఎన్నాళ్లు?

బాధ చెపుదామన్న
మాట నోటికిరాదు
ఎంత నలిగిన గాని
ఎవడు కన్నులగనడు
ఎవని పాటేవాడు
ఎవని మాటేవాడు..........ఎన్నాళ్ళు?

ఎన్ని బాధలు పడ్డ
ఎవడు దయ చూడడే
ఎంత అరచినగాని
ఎవడు మార్పల్కడే
ఏటినిద్దుర యిద్ది
ఏమి మత్తురయిది.........ఎన్నాళ్ళు?

ఉదయమే లేనట్టి
ఈరాతి రెన్నాళ్ళు?
యింత కదలిక లేని
ఈ జీవ మెన్నాళ్ళు?
ఈ బ్రతుకు ఎన్నాళ్లు?
ఈ చావు ఎన్నాళ్లు?.........ఎన్నాళ్లు?

బాధలనడం తోనే
మాటలను కోకండి
ఆకలాకలి అంటె
కేకలను కోకండి
ఉఱుములేని పిడుగు
ఏమౌనో ఎవడెరుగు.........ఎన్నాళ్లు?

# ఆకలి

ఏమిటో! ఈ జగమెరుగము
ఎవరమో! మేమసలెరుగము
ఈ చరాచర ప్రకృతి
ఎవనిదౌనో సుంతెరుగము
తెలుపెరుగము నలుపెరుగము
ఆ క లి
ఆ క లి
ఆ క లి.

మములాలన చేయుమంచు
మముపాలన చేయుమంచు
భూవిభునెత్తిన మణిగ
భూరి కిరీటం బెవ్వడు
శ్రద్ధ మెయిని తెచ్చియిడెనొ'
కొద్దిగైన మేమెరుగం
రాజుమోము చూచెరుగం
రాజెవరొ అసలెరుగం
ఆ క లి
ఆ క లి
ఆ క లి.

మా కబళము మా కందదు
మాయ ఏమిటొ! ఎరుగం
కష్టము మాత్రం తరుగదు
కారణమేమిటొ! ఎరుగం
వండి సిద్ధపడి నన్నము
వడ్డన చేయుట కొరకీ
చండి మగల బొట్టుపెట్టి
తరలిరాండి! యని అసలె
పిలచియుంట మేమెరుగం
అంతెరుగం - ఇంతెరుగం

ఆ క లి
ఆ క లి
ఆ క లి.

స్వర్గాన్ని సృజియిస్తె
నరక బాధ పడవలెనా ?
అమృతాన్ని చిలికితీస్తె
హాలాహలము మ్రింగవలెనా?
పూవుల మీ శయ్య జల్లి
ముళ్ళపైన దొర్లవలెనా ?
యివియేనా మీరీతులు?

యివియేనా మీనీతులు?
యిది ఏలోకపు నడతో!
ఈ వింతలు అసలెరుగము

ఆ క లి
ఆ క లి
ఆ క లి.

దారిద్ర్యపు సిలువ ఎక్కి
తపను చేసినది చాలు
సిలుగుల శరశయ్య పైన
చేసిన నిద్దుర చాలు
అజ్ఞానపు ముళ్ళమకుట
మాభారము ఇక చాలు
మమువిడిచి తరలిపొండు
మాదారిమె మాకు నిండు
ఊరక దారులు అడ్డకు
డేమగునో ఎవడెరుగును

ఆ క లి
ఆ క లి
ఆ క లి.

# జనత

ఎవరమొ మే మెవరమొ మీ
రించుకైన ఎరుగుదురా?
మాజననము చీకటిలో
మామరణము వాకిటిలో
మా చరిత్ర విస్మృతిలో
మా ఉనికే మాకు తెలియ
దెవరి కనుల కగుపించము
ఎవరికనుల మెరిపించము
యంతకె మము శంకింపకు
ఉన్నారము, ఉన్నారము
ఉన్నారము ఉన్నారము.
ఉర్వియంత ఉన్నారము
ఉండిలేని గాలి యట్టె
ఉన్నారము, ఉన్నారము.
మేఘాలను దాగియుండు
మెఱుపువోలె ఉన్నారము

ఉలుములేని పిడుగువోలె
ఉన్నారము, ఉన్నారము.
మాకులేవు కులగోత్రాల్
మా తలను రుద్దిరెవరొ
అంతంతె మాశ్రద్ధలు
అంతంతె మా పూజలు
యేమిసేతు మేమిసేతు
ఎవరిమాట తోసియవలయు
రెమ్మూగుచు నున్నదనిన
కొమ్మూగెడి ననతీరును.
ఏవిద్యలు చదివితేమి
ఏలకొ జ్ఞాపకముండవు
అందుకె మాకింతమంది
అడుగడుగున ఆచార్యులు
ఏసుపాల మీవరకును
ఇంతధ్యాస చేయలేదు
శాక్యసింహు నిర్వాణము
మాకింకను గీర్వాణము

భూకల్పము నాటినుండి
భూరి గుణాఢ్యులను చేరి
ఏమి నేర్చినది లేదు
ఏమి మరచినదిలేదు
ఈ లోపము ఎవరిదొ మా
కింతవరకు తెలియరాదు.
స్టాలిన్ మాశ_క్తి చూచి
సమ్మోహితుడై పోవును
గాంధి మాదు భ_క్తిజూచి
కడపెదవుల నవ్వుకొనును
నిష్ఠురమైనను సరిమె
నిజము చెప్పుచున్నాము
ఏనియంత హక్కు_భు_క్తి
మెన్నటికిని మేముకాదు
మాఏలిక మనులోనిమె
మా కోపాగ్నికి గురియై
మాడిపోవ ఇకఎవ్వడు
మాధాటికి నిలవగలడు ?

నీరధినైనను నరిమె
నిలిపి ఉంచగలరేమొ !
గాలి గుజ్జమునకైనను
కళ్లెమేయ గలరేమొ!
గాలికన్న నీరుకన్న
కడు తీవ్రప్రవృత్తి మాది.
మనులోనిని మాడ్చితిమని
మండకుడీ మా పైన
ఏసు సిలువ గొట్టితిమని
ఈసుపూన బోకుడయ్యా
సిలు వెక్కించిన మేమె
నిలు వెక్కించిన మేమె
ఉరి ఎక్కించిన మేమె
కరి ఎక్కించిన మేమె
ధూళిజల్లినను మేమె
పూలు జల్లినను మేమె
ఎవరమొ, మేమెవరమొ మీ
రింకుకైన ఎరుగుదురా ?

తెరచాటు భాగవతము
సరిపడదు మాకెప్పుడు
చల్లకొచ్చి ముంతదాచు
సరసము మే మసలెరుగము
సీత గూర్చియైన సరె
శృతులేమైనను పుట్టిన
కొండ పగల వేసినట్లు
గుండెలోతు చెప్పెదము.
మా బ్రతుకని మమ్ముద్రొక్కుచు
మహా మహులు మనగట్టె
ఎవ్వరినైనను స్థిరముగ
ఇలవేల్పుగ భజియింపము
మా దర్శన భాగ్యముకై
మాసీడల తిరుగకుడీ
మా క్షేమమె మదినున్నచొ
మరు నిముసము మీవారము
ఎవరమొ మేమెవరమొ మీ
రిప్పుడైన ఎరుగుదురా ?

# రైతు - రాజు

రైతు : హలము పట్టను
పొలము దున్నను
నారు వేయను
నీరు పోయను
కంచె వేయను
మంచె కాయను
కాలు కదపను
వేలు ఊపను
చాలును ఈశ్రమ ఓరాజ !
చాలిక్కడికి ఓ రాజ !

రాజు : హలము పట్టవా ?
పొలము దున్నవా ?
నారు వేయవా ?
నీరు తోలవా ?
కంచె వేయవా ?
మంచె గాయవా ?
నా రాజ్యంబిది ఓ రైతా !
నన్నెరుంగవా ఓ రైతా !

రైతు : గుణనిధి రాజా !
కోపము వలదు
సర్వము తానై
జగము నేలెడి
గాలిని నీవా
కదల చేయుటలు ?
వేడిమి ఇచ్చి
వెలుగును పంచి
భూమికి ప్రాణం
పోసే సూర్యుడు
నీ యాజ్ఞలనే
నింగి తిరుగునా ?
పగలు రాతిరి
పచ్చని చేల
కష్ట సుఖముల
కంట జూచుచు
నీర మొసగెడి
నీలి మబ్బులు
నీ కను సన్నల
నిలిచే బంట్లా ?

గాలిని వెలుగును
కదపలేక ఇక
పాపము ! అసలే
పలకగ రాని
కరచిస పొడచిన
కదలగ లేని
మూగ ధరిత్రిని
ముష్కర సేనల
ఆక్రమించుకొని
అండచేసుకొని
పాలన చేయుట
భాగ్యమె రాజా !
విచ్చల విడిగా
విశ్వము తిరిగె
గాలి వెలుగువలె
నేలయు కూడా
పరి పిరాళకు
ఎరగా కుండిన
రాజులు లేక
రైతులు లేక

పాలక పాలిత

పక్షాల్ లేక

ఈ లోకం స్వ

ర్లోకం కాదా !

రాజు : ఆగుము రైతా

ఆపుము కైతా

గాలి వెలుగుయని

గోల జేసెదవు

పంచ భూతముల

ప్రసక్తేలయట

మన్ను మన్నెయా

ఎన్నటికైనను

మట్టిపైన నా

పాలన ఏమిటి ?

పరిభూత యంతయును

ప్రజల మనుసుపై

ఈ మాటింకయు

ఈ వెరుంగవా ?

రైతు : ఓహో ! రాజా
ఓపిక కొంచెం
పట్టి లేనిచో
మనుషుల నీవు
ఏవిధంబుగా
ఏలెద వయ్యా !
అవని నీదు హ
స్తాన మున్న నే
ప్రజలపై
నీ పరిపాలనము.
మట్టిని నీవు
ముట్టుకోనిచో
ఎవరికి రాజువు ?
ఎవరికి ప్రజలు ?
మట్టిలేక యిక
మనుషుల ఏలుట
ఎంతవారికొ
యిల అది సాధ్యము

నిత్యము నీ సభ
నిన్ను పొగడ్తల
ఇంద్రుని జేసెడి
వంది మాగధుల
మాటలు నమ్మి
మైమరిచేవు
ఘనకమునై నను
కనక పీఠిని
కూర్చో పెట్టిన
గొప్ప చేసెదరు.
రాజులు పొందెడి
పూజ లన్నియును
పూ విధు లేలెడి
భూములవే అవి,
నిష్ఠురమైనను
నెటి సత్యమును
నే నవలంబించితి

నీ యిష్టంబిక.
ధనిక దరిద్రుల
తార తమ్యము
ద్రవ్య శక్తియే
తా కల్పించును
రాజా ! యింక
చూచెద వేటికి ?
కనక పీఠిని
కాల తన్నుము
నీ వారలలో
నీ వొకడౌదువు
కల్పిత భేదాల్
గంగ కలిసెనా
రాజులు లేక
రైతులు లేక
మానవ జాతి
మహి సుఖియించును.

# దేవతలు వస్తారు

యింక నిద్దుర లేదు
యింక రాతిరి రాదు
ఎవ్వరో నా హృదిని
దివ్వె వెలిగించారు.
దీపమా ! యిక నిన్ను
కాపాడు కోవాలె

చీకట్లు మీరింక
సెలవందు కోవాలె.
ఘోరాలతో క్రృంగు
గుండె వత్తిగ జేతు
నా కంటినీరు ప్రా
ణము పోతు దివ్వెకు.
నా దివ్వె నార్పగా
నల్దిశల పై బడెదు
దుష్ట బుద్ధులు మాడి
మారమై పోతారు.
నా జ్యోతి మిలమిలలు
నల్దిశల ప్రసరించి
భగ్నజీవుల కెల్ల
బాట జూపిస్తాయి.
నా గర్భగుడిలోని
నాథు సందర్శింప
క్షితిజ రేఖలు దాటి
దేవతలు వస్తారు.

## సాధన

ఎన్ని దినములు నీవు
యిల గడపినను ఏమి ?
ఎన్ని జన్మాలింక
ఎదిరి చూచిన ఏమి ?
ఎన్నాళ్ళకైన నీ
ఔన్నత్యమును నీవె

సాధించవలె నోయి
శోధించవలె నోయి!
అదిరి బెదిరి దిశల
ఆర్తి జూచెదవేల
దిక్కు లెవరున్నారు
మక్కువన నినుబ్రోవ?
నీలోన వెలుగొందు
నీ స్వశక్తిని మరచి
పరుల పంచలజూడ
ఫలమేమి కలదోయి!
నీకు తెలియదు సఖుడ
నీ మహోజ్వలశక్తి!
మందమతివై నీవు
క్రుంద గతియేమొచ్చె
యెన్ని యిడుములనైన
ఈ వొందినను సరియె
నీ గర్భగుడిలోని
దివ్యాశి కనుగొనుము.

పొరిగింటి దీపమును
పూజింతు వెన్నాళ్లు ?
ఒరుల ములుగఱ్ఱ కిక
ఒడలిత్తు వెన్నాళ్లు ?
నీ శక్తియే నీకు
నిధి యాట సరె కాని
నీ శ్రద్ధయే నీకు
నీడకావలె కాని
కుక్కతోకను బూని
గోదావరీదెదవ ?
గొప్పవారన గాసె
కృంగి పోదువదేమి ?
ఘనులనేరిని గన్న
కాళ్లవణకు నదేమి ?
గొప్పవారొక నాడు
కొద్దివారే వినుము
కొద్ది, కొద్దిగ వారు
గొప్పవారై నారు

గొప్పతన మేరికిని
కూర్చుండ రాలేదు.
నీ పక్రిమిదలో చమరు
నిశ్శేష మౌనంచు
కృంగి కృంగి నీవు
కూర్పాట్ల బడబోకు
జేగీయ మానముగ
జీవించవలెనన్న
మరణించవలె నోయి
మరి త్రోవ లేదోయి.
వేయి మాటలు ఏల
ఓయి నా ప్రాణ సఖ!
శ్రద్ధయే మనుజుండు
సాధనయె సర్వంబు
ఎట్టిశ్రద్ధను మనుజు
డిలపూనునో అట్టి
మనుజుడే వాడగును
మహితాత్మ! యిది నిజము.

## హితోక్తి - 1.

నీ చేయు పనిఏదో
నీవు చేయుముకాని
అన్యులను నీవేల
అనుకరించెదవోయి.
ప్రత్యేకముగ నీవు
పట్టింపుతో చేయ
వలయు కార్యంబొకటి
కలదు ఈ భువి సఖుడ.
ఆ కార్యమివు దప్ప
అన్యులతొ కాదోయి
మెర మెచ్చులకు నీవు
మురిసిపోవగ దలచి

వెనుక ముందు లేక
అనుకరింతువు పరుల
మాయ మోసము నెపుడు
మహినిల్పునా హితుడ.
చిలుక పలుకులు పలుక
శృంగార మెవ్వరికి ?
నీ ఆత్మకే నీకు
నిందులేనిచో యింక
ఏది సంతృప్తి కిటు
ఈ ఆట లాడెదవు ?
పలుకమని నిన్నెవరు
పాడమని నిన్నెవరు
బ్రతిమాలిరి హితుడ
బలిమిచేసిరి సఖుడ
పాడినది పాడుటకు
ప్రళయ మింతేమిటికి ?
అనుకరణలో మ్రగ్గి
ఆత్మ చంపెదవేల

ఆత్మ వ్యక్తీకరణ
అదె సృష్టిపథమోయి.
కోకిల పాటేదో
కోకిలయె పాడాలె
కాకి పాడిన నెటుల
కనుపించునో చెప్పు.
ఒరుల దుస్తులు దాల్చి
ఊరేగుటలు మరవు
రాజ రాజువు సరియె
రాణింపు నీకేది.
పరుల గొప్పలపైని
భ్రమ వదల నన్నాళ్ళ
నీ గొప్ప ఏమిటిదో
నీకు తెలియదు సఖుడ.
నీ పలుకు ఏదైన
నీ పాట ఏదైన
నీ అంతరమునుండి
నీటుగా రావలయు.

# హితోక్తి-2.

జీవచ్ఛవముగ ఏటికి
చిరకాలము బ్రతుకవలెను
ఒక్కగడియ చాలదోయి
ఉజ్జ్వలమగు జీవితమ్ము.
జీవించుట యనిన నురక
జీవించుట కాదెప్పుడు
జీవమె లేకున్న నద్ది
జీవన మెటులగునోయి.
జీవము నీ జీవనములో
చిందులాడ వలెనన్న
జీవితమునె బలిగ నీవు
చేసి తీరవలెనోయి.

పిడికిటేమి లేకున్నను
బేరమాడ తలచినావా ?

మూల్యమివ్వకీ జగతిని
ముట్టలేవు ఏ వస్తువు.
నీకు వలయు వస్తుచయము
నిఖిలము యిట లభియించును
మూల్యము సిద్ధముచేయుట
ముందు నీదు కర్తవ్యము.
కాసయినను చేతలేక
కామితార్థ మెవడుపొందె ?
గుడ్డిగవ్వ ఒకటిలేక
గుడ్డిగవ్వ లభియించదు.
పిడికిలి బిగియించి నీవు
బేరమాడలేవు ఎపుడు
నీచేయే ఆడనిచో
ఏ చేయి ఆపదిచట.
ఆశ్చర్యంబుగ జగతిని
ఆలోకన చేయ ఫలము ?
శక్తిఉన్న బేరమాడు
చాలనిచో దయచేయుము.

# అనంతయాత్ర

యిది అనంతయాత్రి
యిక నిదుర విడువోయి
పయనించు టే నీదు
పరమాశయంబోయి.

పయనించు పయనించు
బాట ఏది? అనక
పదిమంది దారితో
పనిఏమి నీకోయి?

బాటకోసర మెవరు
పయనించగా లేదు
అడుగుపై నడుగేయ
అదె దారి యగునోయి.

పెక్కుదారులు చూచి
చిక్కు పడగాబోకు

నీకు తోచినతోవ
నీవు పోవగదోయి.
ఏరు నాతోవ వత్తు
రో రారాయని వృథగ
ఆరాటపడి నీదు
దారి మరిచేవోయి.
యింత నడచితి నంచు
సంతోష పడకుబ్బి
నడకలోనె నీదు
నాణ్య మిమిడుందోయ్.
కష్టాలు నీదారి
క్రిమ్ముకున్నాసరె
ఒక్కొక అడుగేస్తె
యోజనము లగునోయి.
బాటసారిని నేను
పయనించుచే నాడు
ఆదర్శమనుమాట
హృది మరచిపోకోయి.

# ఆత్మ వేదన

ఎవని దుఃఖ భరము
ఎవనికి కావలెనోయ్
ఎవని ఏడుపు వాడె
ఏడిచి పోవలెనోయ్.

వినేవారు ఎవరు
వినకపోయినా సరె !
తన ఏడ్పు తా ఏడ్చి
దాటి పోవలెనోయ్.

ఏడవటాని కెందు
కితరు లాశించాలె

తన ఏడ్పులో తానె
మునిగి పోవలెనోయ్.
యితరు లూరడిస్తె
ఎక్కువచ్చె దేడ్పు ?
పరుల ముఖము కొరకు
పలవింప వలదోయ్.
ఏడ్పు మంచిదెకాని
ఏడ్వు ! మంచిదెకాని
నీ స్వార్థమునకీవు
నెరి ఏడ్వవలదోయ్.
నింగిముట్టె అట్టు
పొంగివచ్చె ఏడ్పు
ఏడుపుకాదది ఆత్మ
గోడుగా తలపోయ్.
నీ ఏడ్పులో నీవు
నిండ మునిగిపొమ్మ
నిఖిల లోకాలొచ్చి
నీ పాట వినునోయ్.

# అద్వైతము

ఏ భూమియని నిన్ను
ఎవరైన అడిగితె
ఏ జాతియని నిన్ను
ఎవరైన కదిపితె
ఎందుకో ! నా మనసు
క్రింద మీదై పోవు.
ఏభూమి ఐతేమి ?
ఏజాతి ఐతేమి ?
ఏరంగు ఐతేమి ?
ఏ రూప మైతేమి ?
మానవుడనేనంచు
మదితోచు చున్నపుడు.........ఏభూమి.
అద్దానతన మోము
ముద్దుగా తిలకించి
ఏకులము నీదియని
ఎవరైన అడిగేర ?

నరులమె మనమంత
సురలెవరు యిట కొంత
నీనీడ దయ్యమని
నీవు జడియుటె వింత.........ఏభూమి.
నీ హితుని కౌగిలిలో
నీజాతి మరిచేవు
నీ సుతుని ముద్దాడ
నీ మతము మరచేవు
అన్యులము మేమంచు
అదిరిపాటేలోయి
నీకులమె నాకులము
నీమతమె నామతము
నీరూపమె నేను
నీవె నేనేనోయి
నీ రక్తమే నాదు
నిలువెల్ల ప్రవహించు.........ఏభూమి.
గాలిలో గాలివతు
కలిసిపోగల వీవు

చినుకులో చినుకువతు
చెరిగిపోగల వీవు
నిన్నునీవు మరచి
నిఖిలమయ్యే నీకు
కులమేమి ? మతమేమి ?
సెలవేమి ? నుడువోయి........ఏభూమి.

మతవాదముల చిక్కి
క్రుగ్గబోకీ వన్న
మంచుగడ్డగ నీవు
మనెద వెన్నాళ్ళున్న
మంచుగడ్డవు కావు
మహిమాన్వితంబైన
నీరధివి నీవోయి
నీకవధె లేదోయి
కరగుచే తడవోయి
పెరుగు నీజవమోయి
కరిగి కరిగి నీవు
కడలి కాగలవోయి. ........ఏభూమి.

# జీవితము

జీవితమొక ఆరాటము
జీవితమొక పోరాటము
నిమిషమాత్రమైన సరె
నీ ధ్యేయము మరువరాదు.
లెమ్మ! లెమ్మ! ఓ పథికుడ
లెమ్మ! లెమ్మ! ఓ రథికుడ.
నిస్తబ్ధత నిర్వీర్యత
నిరాశ, నిస్పృహల వీడి
కదలుము వీరుడి వలె నీ
గమ్యము దెస వెనుచూడక.
ఆరాటము లేని చోట
పోరాటం బెటులుండును ?
అనవరతాన్వేదనయె
అభివృద్ధికి మూలమరయ.
పోరాటము మాని నీవు
భువిని బ్రతుకలేవు ఎపుడు

యిష్టములేకున్న నేమి
ఏదో ఒక వెతతప్పదు.
అసంతృప్తి, అన్వేషణ
ఆవేదన, ఆలోచన
ఆహరహంబు హృదినిండిన
ఆత్మకిచ్చునవియె శక్తి.
పోరాటంబనిన నీకు
భయంబేలనోయి సఖా !
పోరులేక ఏగతిని భువి
పురోగమనమొందె దీవు ?
పురోగమనమొకటె నీదు
పూర్ణత్వమునకు మూలము
పురోగమన మాగినచో
తిరోగమనమే కదయిక.
నీ గమ్యముపైని చూడ్కి
నెఱి నిరతము నిలిపినపుడె
అంధకార బంధురమే
సుందరమౌ నీదుదారి.

నీ సుందర స్వప్నాలకు
నిమిష, నిమిషమునకు నీదు
శక్తి ధారవోసిన నది
సాక్షాత్కారము నిచ్చును.
ఊహాలు, పోహాలులేని
ఉజ్జ్వల స్వప్నాలు లేని
ఎడారి జీవన మేటికి ?
ఏటికి ఆ వెదగు బ్రతుకు ?
తుచ్ఛకాలముల కన్నను
మారకాంక్షలె ఎప్పుడు
నింగిపైకి నెత్తునోయి
నిను చీకటి కూలకుండ.
అపజయాల కడలి నీవు
అంధుడవై క్రుంగబోకు
అపజయాల మూలము నీ
ఆత్మలోనె కల దెరుగుము.
వేదనాగ్ని పూర్ణమైన
విమలహృదిని నల్పములా

కామందులు చేరజనవు
కాలునగ్ని మిడతలగతి.
అర్థమనస్కత నెప్పుడు
ఆచరింపబోకు పనులు
పూర్ణాహుతి లేనిదే హృది
పుష్టి తుష్టి కలగబోదు.
గమ్యముపై దృషినిలిపి
గెలుపువరకె నీదుబ్రతుకు
ఆదర్శ చ్యుతుడవైన
ఆ క్షణమె మరణమెరుగు.
కత్తిపైన నడక సుమీ
గమ్యమున్నవారి బ్రదుకు
కన్నుమూత పడగరాదు
కాయము భువి నిల్చువరకు.
నీ గమ్యము చేరువరకు
నిలుపబోకు పోరాటము
సృష్టి ఒకటిచాలు భువిని
కష్టాలవె గడచిపోవు.

# కుపిత నగము

ఏనాటి క్రోధమిది
ఈవు పలుక విదేమి
పాపమా! మబ్బు నిను
బ్రతిమాలినను నగమ!
నింగి నీకోసరము
నిశలెన్ని గడిపినదో!
కనుపించగనె నీదు
కంఠాన వ్రాలినది.
ఏనాటి ఎడబాటో
ఏ చిరంతన వ్యధయొ
నీస్పర్శతో మబ్బు
నిలువు నీరైపోయె.

నీకంఠమును జుట్టి
నినుగోముచేసినను
కదలవేమి! గుండె
కఠిన పాషాణమా!

పొల యలుక నేమైన
పొరపులోచ్చెన మీకు
ప్రణయ కోపముకింత
పట్టింపులేమిటికి ?

ఎన్ని దినములు నీవు
ఇటు అలుక బూనెదవు
మునివృత్తియే నీకు
ముక్తిదాయకమౌన ?

నిలువెల్ల తానగుచు
నిన్ను బ్రితిమాలినను
నీలోని అణువైన
జాలిచెందదు ఏల ?

మూగనోమును బూని
మునివృత్తినుంటేమి

ఎక్కడో నీ హృదిని
నిక్కముగ ఈసుంది.
నీ మనస్సే ఇంక
నిర్మలంబౌనేని
పల్లెత్తు మాటైన
పలుకవేమి నగమ ?
కన్నీరు నీపైన
గార్చినన్ ఫలమేమి ?
కఠిన మానసులెపుడు
కన్నీట కరుగుదురా ?
వేడి వేడి నిన్ను
విసుగొచ్చెనో మేము
సోపాన నదెమెరసె
పాపమా జవరాలు.
కరకు గుండియ నీది
కరిగింప లేదెవడు
కరిగి, కరిగి మబ్బె
కడకు నీరై పోయె

# ఉఱుములు - మెఱుములు

యెవరయా! ఈ కారుమబ్బుల
ఇరులమాటున తొడలుచరిచి
తేజుకత్తుల దిక్కులంటగ
తిప్పుచున్నారు.
సమరము చేయుచున్నారు?

యేమిటా! నులివెట్టు ద్వేషము
మెందుకా! మినుముట్టు రోషము
యెవరులేరా! మీకు తీర్పరు
లింటి వారలు
హృదయము నంటువారలు?

వాడికత్తుల రాపిడులచే
వజ్రిసమ పద ఘట్టనలచే
దిశల గుండెలు కదలిపోయే
తీరదా మనసు
ఇంతకు యెందుకా నలుసు ?

యెంత! స్త్రీ వెంతంచు! మీరలు
ఇతులతెగి కయ్యంబుచేసిన

ప్రళయకాలము నాటికైనా
బాపగాలేరు
యెవరు మిమ్మాపగా లేరు!
అదిగో చూడుడి! మబ్బుమత్తున
యెరనుచించుక యేడ్వసాగెను
యెవరు మడిసిరో ప్రాణబంధువు
లింటి వారలు
యింతకు! కానివారలు.
మన్నుమిన్ను యేకమయ్యెను
మబ్బుగుంపుల బాష్ప లహరిచే
దిక్కులన్ని మూగిపోయెను
దిక్కు చీకటిచే
యెక్కడ తోవగానమిచే.
ఇంతకైన తీరిపోదా !
యీ మహా ప్రళయాట్టహాసము
యేమిపమినో సత్తిపైనని
ఇల పతంకెడిని
ప్రాణములె గుంచెడిని.

# అంధుడు

> ఏమిటేమిటీ లోకం
ఎట్టులుండు ఈ లోకం
ఏ వింతలు ఇటగలవో
ఎరగలేను మాలోకం.
ఇంతకు మీరెవరోకాని
ఏనొక అంధుడ ఖర్మం
ఎందుకు నేనిటునడచిన
ఏదో పాదముల తాకును
ఏమిటివి గాయపులా ?

ఎంతమృదులముగ సోకును
ఎవరివెవరివా ! పలుకులు
ఇంతజాగిలా పులుగులు
ఎంతహాయి ఈ లోకం
ఏమిటి నాకీ నరకం ?
వెతికి వెతికి వేసరినను
వెలుగుజాడ కనిపించదు
కనులల్లో చీకటులే
తనువెల్ల చీకటులే
చీకటెల్ల నాలోనే
స్థిరపడెనా మరిఏమి ?
లోకాలే చీకటులా
చీకటులే లోకాలా
ఈ చీకటి చెరలోపల
ఏనొకడనై ఖైదీనా ?
ఎవరోమీరు చెప్పరేమి ?
ఇది దుర్దాంత పరివాసము
ఈ చెరను కూలదన్ని

ఈ చీకటి తరిమివేయ
ఈ ఘోరము రూపుమాప
ఈ గరళము మ్రింగివేయ
నా గుండెలు వేయివిధుల
నారాటముచేయు, తుదకు
నా ప్రాణము డస్సిపోవ
నా హృదయము చితికిపోవ
కడకు నాలా చీకటియే
కదలకుండ నిలిచిపోవ.
చీకటిబ్రతు కీడ్చుకొనుచు
లోకము తిరిగెడి నసుగని
ప్రాణము నాలోకలదని
భావించెదరేమొ తప్పు.
ఉన్నానో ! మరిలేనో !
ఉండిగూడ చెప్పలేను
సున్ననేనె! అసున్నుడ !
కన్నులతో గాంచనపుడు
ఉండిలేని బ్రతుకెకదా

ఊరక మాటలు ఏటికి ?
వేయికండ్లు చేసుకోని
వెలుగుచూడ వలెనంచు
తనువెల్ల కోర్కెగాగ
తపియింతును పగలురాత్రి.
పగలురాత్రి యననేను
ఫక్కున నవ్వెదరేమొ
కడమొదలు లేనిదీర్ఘ
కాళరాత్రి నాదినిజము.
నాకళ్లు మూసి నాలో
నరకము నెలకొల్పిరెవరు ?
ఈ చీకటికొట్టున నను
యిరికించిన దేలిరెవరు ?
మెదరుమారు పలుకరేమి
యింతేనా నా బ్రతుకిక
యినునిజాడ కనబడదా ?
యేమిటేమిటీ లోకం
యింతేనా నా శోకం

## చీమలబారు

ఓహో! మీరెక్కడికి
ఓ చిన్న చీమలార
ఏసీమకు మీరేగెద
రీతీరున బారుగట్టి ?

ఎక్కడికి, ఎక్కడికి?
ఈ సమూహ మెక్కడికి ?
కయ్యానిక, వియ్యానిక
అయ్యారె! మీరేగుట ?
ఒకరి వెనుక ఒకరు మిగుల
ఓరిమితో పోయెదరు
ఎవరోయి మిమునడిపెడి
ఇంగితజ్ఞు లింతఘనులు.
యెవరో ఒక నేతలేక
ఇంతకట్టు దిట్టముగా
మనుషులమె నడువలేము
మరి మీపోకడ చిత్రము.
పనిపాటలు లేక మీరు
పాత్రిలుమాలి తిరగరహో !
యెక్కడికి ఈ ధాన్యము ?
యెవరిళ్ళకు ఈ యెగుమతి?
మడిమాన్యము లేదు మీకు
మరిధ్యానము సమకూర్తురు.

కళ్ళముకొాక గింజమైన
కావె కొల్లలు, కొల్లలు.
ఏయే పొలములు తిరిగి
ఈ ధాన్యము గూర్చితిరి
యెవడుచూపె కడుదుర్గమ
మైన ఐ్రితుకు బాట మీకు ?
ఈ వివేక మీ పొదపు
యెటనేర్చితిరో కాని
ఈ శిక్షణ మనిషికున్న
ఇకలేములు మెక్కడివి ?
మెవరివద్ద చదవకనె
ఈవిద్దెటు నేర్చితిరి
కోటివిద్యలైన తుదకు
కూటికెరద మాకైనను.
యే మేమొ నేర్వదలచి
యెటకెటకో పోయెదము
కండ్లముందు యెపుడు తిరుగు
ఘనుల కానలేము గదా!

# కాలిబాట

అదిగదిగో కాలిబాట

అందాల కాలిబాట

యెటనుండో యెటనుండో

ఏ సుదూర స్థలమునుండో

నిలుకడ నిద్దురలేని

నీరువోలె ప్రవహిస్తు

గమ్యము గృహములేని

గాలివోలె విహరిస్తు

స్వేచ్ఛాజీవన వర్తిని

స్వచ్ఛముగా వెలుగుతు భువి

నవతరించివస్తున్నది

నాదరింప వస్తున్నది.

ఏ భూమిని పుట్టిందో

ఎటుల చెప్పగలము మనము

ఏ సీమకు బోతుందో

యెవరు చెప్పగలరు నిజము

మంచిరాల పోతుందో !
మానుకోట పోతుందో !
లండనుకే పోతుందో
లాసాకే పోతుందో
ఈరాకో, మొరాకో
ఈజిప్టో, సిరియాకో,
యెక్కడికో, యెక్కడికో
యెవరెరుగని ఏ భూమికొ
పాదమేసి, పాదమెకద
పల్లైతేం, ఢిల్లైతేం.
అడవి జూచి హడలిపోదు
ఆత్మ యెంతదొ కాని
గుట్టచూచి కుర్రింగిపోదు
గుండె యెంతదొ కాని
నీరుచూచి నిలచిపోదు
నిష్టయెంతయొ
మిట్టలు, పల్లాలురాని
చెటులు, పుట్టలురాని

యండ యేడారులు రానీ

మంచు దిబ్బలె రాని

కందకాలు అడ్డురాని

కంటకాలు అడ్డుపోని

ఆగిపోదు కాలిబాట

సాగిపోవు కాలిబాట.

రోడ్డుముందు కాలిబాట

గడ్డిపోచవలె తోచును

రైలుముందు కాలిబాట.

లక్ష్యపెట్టరెవరు నిజమె

విమానయానము ముందర

విలువసలే లేదుకాని

గడ్డుతోవ లెదురొచ్చి

రోడ్డుకాళ్లు చాచుచోట

కొండచాళ్ళ చూచి రైలు

గుండెలాగిపోవు చోట

వాయు విమానం ఊపిరి

తీయలేక కూలుచోట

ఒంటరిగా, ఓరిమిగా

ఒకొకఅడుగె భారంగా

సాగిపోవు కాలిబాట

సాగిపోవు పూలబాట.

టిక్కట్టు లేకుండా

ఢిల్లీకి పోవచ్చును

పాస్‌పోర్టు లేకుండా

మాస్కోకు పోవచ్చును

సెంటుచేత లేకున్నా

షికాగో పోవచ్చును

కలకత్తా పోవచ్చును

కాకినాడ వెళ్ళొచ్చును

యెముకలోన బలముంటే

యెవరెస్టు యెక్కొచ్చును.

సీజను టిక్కటులేక

సృష్టియంత తిరుగొచ్చును

ఇక్కట్టొక టోర్చుకున్న

చక్కగపయనము సాగును

కాలిబాట, కాలిబాట.

పిటీషన్ల, ఫిర్యాదుల
పేచీలసలే వుండవు
యెస్టిమేట్ల కంట్రాక్టుల
ఇబ్బందులు లేనేలేవు
మరామతుల మంజూరుల
మాటఅసలె వినరావు
గ్యాంగుమెనుల,. ఓవరుసీర్ల
గడబిడలే ఉండవసలు
నేలబొగ్గు, రోలర్లు
నీళ్లచల్లు మోటార్లు
ఘనముగ విమానముపై
గవర్నరొచ్చి తెరవవలయు
కార్యభార మేముండదు
కాళ్లకు చెప్పులులేని
గంజికి గుడ్డకులేని
కడుపేదల నడకబాటు
సాగిపోవు కాలిబాట

సాగిపోవు పూలబాట.
విప్లవకారులు దీనిని
విచ్ఛేదము చేయలేరు
యుద్ధాలెప్పుడు దీనిని
హద్దులోన పెట్టలేవు
ప్రళయా లొచ్చినగాని
బాటరూపు మాసిపోదు
దేశగతులు మారినను
లేశము తా చెక్కుచెదదు
స్వేచ్ఛాజీవన ప్రియుల
ఇచ్ఛతోడ జనియించిన
కాలిబాట నాపినట్టి
ఘనుడుకానరాడు భువిని
కాలిబాట, కాలిబాట
కలకాలము వర్ధిలుమిట.
ఋజుమార్గమె కాలిబాట
నిజ జీవనపథము చూడ.
రాజుగారి కోటఉన్న

లక్ష్యపెట్ట దిసుమంతము
రాణిగారి తోటఉన్న
రవ్వంతయు తొలగిపోదు
క్లబ్బుఉన్న, ఉరుసుఉన్న
కాలేజి గ్రౌండుఉన్న
బాపిటిస్టు చర్చిఉన్న
బ్రహ్మజెముడు కంపున్నా
కంచెఉన్నా, పొలమున్నా
కాలిబాట లేదంటు
కలుపు సైనుబోర్డున్నా
ఆగిపోదు కాలిబాట
సాగిపోవు కాలిబాట.
కాలిబాట లేనిచోటు
కన భూమిని కనిపించదు
ఉత్తర దక్షిణ ధృవాలు
ఉరల్ పర్వతశ్రేణులు
పట్టణాలు, జనపదాలు
పంటచేలు, ఫ్యాక్టరీలు

అంతట తానై యుండును
అంతరంగ హితునిమాడ్కి.
అన్నిదిశల తానున్న
అల్లిబిల్లిగానున్న
దేశపటము వెదికిచూడ
దిజ్మాత్రము కనుపించదు.
గుడ్డివాళ్ల గాజులోళ్ల
కోర్టుప్యాన్లు, పోస్టుమ్యాన్లు
కూలివాళ్ల, పాలవాళ్ల
పాకివాళ్ల, చాకలోళ్ల
పయనించే కాలిబాట
పరుతెంచె ధూళిబాట
మ్యాపుపైన ఉంటుందా?
మరియాదల గంటుందా?
పేదలు సాదలు, దేశపు
పెద్దలహృదినుంటారా ?
కాలిబాట కాలిబాట
కలకాలం వర్ధిల్లుమిట.

# మా ప్రచురణలు

| (1938-1941) | సభ్యులకు | ఇతరులకు |
|---|---|---|
| హైందవ ధర్మవీరులు | 0-4-0 | 0-6-0 |
| ప్రాథమిక స్వత్వములు | 0-4-0 | 0-5-0 |
| గ్రంథాలయోద్యమము | 0-4-0 | 0-6-0 |
| *కీ. శే. సురవరం ప్రతాపరెడ్డి* | | |
| కమాల్‌పాషా జీవితము ( 2 భా. ) | 0-8-0 | 0-12-0 |
| *శ్రీ ఖండవల్లి బాలేందుశేఖరం.* | | |
| ప్రజలు - ప్రభుత్వం | 0-4-0 | 0-6-0 |
| *కౌంట్ లియో టాల్‌స్టాయి.* | | |
| ఔంధు సంస్థానం | 0-4-0 | 0-5-0 |
| *శ్రీ పులిగడ్డ వెంకటసుబ్బారావు.* | | |
| నా భారతదేశ యాత్ర | 0-4-0 | 0-6-0 |
| *ఎచ్. ఎన్. బ్రెయిల్స్‌ఫర్డ్.* | | |
| గాంధీమహాత్ముడు ( 2 భా. ) | 0-8-0 | 0-12-0 |
| *విష్ణుచక్రం.* | | |
| కాంగ్రెసు - సంస్థానాలు | 0-4-0 | 0-6-0 |
| సంస్థాన ప్రజల సమస్యలు | 0-4-0 | 0-6-0 |
| *డా. భోగరాజు పట్టాభి సీతారామయ్య.* | | |



# మా ప్రచురణలు

| ( 1953-1956 ) | సభ్యులకు | ఇతరులకు |
|---|---|---|
| 12½% తగింపు | | |
| జైలులోపల ( కథానికలు ) | 0-9-3 | 0-10-0 |
| శ్రీ వట్టికోట ఆళ్వారుస్వామి. | | |
| నా గొడవ ( గేయాలు ) | 1-5-0 | 1-8-0 |
| శ్రీ కాళోజి నారాయణరావు. | | |
| ఉదయఘంటలు ( గేయాలు ) | 1-15-6 | 2-4-0 |
| 56 అఖిలాంధ్ర కవులు. | | |
| ప్రజలమనిషి ( నవల ) | 2-3-0 | 2-8-0 |
| శ్రీ వట్టికోట ఆళ్వారుస్వామి. | | |
| సెలయేరు ( జానపద గేయాలు ) | 1-8-6 | 1-12-0 |
| శ్రీ నేదునూరి గంగాధరం సేకరణ. | | |
| జీవనరంగం ( 15 ఏకాంకదృశ్య నాటికలు) | 3-1-0 | 3-8-0 |
| 15 గురు రచయితలు. | | |
| ప్రజలు - ప్రభుత్వం ( వ్యాసాలు ) | 1-1-6 | 1-4-0 |
| కౌంట్ లియో టాల్‌స్టాయి. | | |
| పునర్నవం ( గేయాలు ) | 1-3-6 | 1-6-0 |
| శ్రీ దాశరథి. | | |
| పరిసరాలు ( 34 కథలు ) | 3-1-0 | 3-8-0 |
| 34 గురు కథకులు. | | |
| తెలంగాణం (32 వ్యాసాలు) | 4-3-6 | 4-12-0 |
| 23 గ్గురు రచయితలు. | | |



# రాబోవు ప్రచురణలు

1. ఆందోళన (ప్రధాన రాజకీయ ప్రణాళికలు)
2. కూర్చిన ముత్యాలు (ప్రముఖుల ప్రవచనాలు)
3. శ్రీ భాగి నారాయణమూర్తిగారి రచనలు
4. పరిసరాలు (3 వ భాగము)
5. తెలంగాణా కవిమిత్రులు
6. గంగు (నవల)
7. అఖిల భారత తస్కర మహాసభ
8. నాలో నేను
9. ప్రాచీన తెలంగాణా
(రాజకీయ, చారిత్రక, ఆర్థిక, సాంఘిక పరిస్థితులు)
10. విజ్ఞాన శాస్త్రము
11. స్త్రీలు-సమాజము
12. బుచ్చిపాపలు (కథలు)
13. సమాజము-వ్యక్తి
14. రైతు రామాయణము
15. తరంగాలు
16. భారతీయ కళావికాసము
17. సామెత కథలు
18. శ్రీ ఆదిరాజు వీరభద్రరావుగారి రచనలు
19. రామప్ప రభస
20. ఆంధ్రుల రాజకీయ చరిత్ర
21. దేవుని పేరిట (నవల)
22. మీరు - మీ పిల్లలు
23. యుద్ధరంగం
24. సైనికుని జాబులు

# గ్రంథ మాలను గురించి

---

దేశ భక్తుడును, ఆంధ్ర ప్రముఖుడును, దేశోద్ధారక, విశ్వదాత, కళాప్రపూర్ణ బిరుదాంకితుడునగు కీ. శే. కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారి స్మారక చిహ్నముగా బహుధాన్య సంవత్సరం (1938) లో ఈ 'దేశోద్ధారక గ్రంథమాలను' స్థాపించనైనది. కథలు, నాటికలు, కావ్యాలు, వ్యాసాలు, జీవిత చరిత్రలు మొదలగు వైజ్ఞానిక గ్రంథాలను ఆంధ్రభాషలో అచ్చువేసి, దేశీయులకు అందజేస్తున్నాము. ప్రతి ప్రచురణము పాఠకుల మన్ననలనుపొంది, వారి ఆసక్తిని ఇనుమడింప చేస్తున్నది. మేము పాఠకులనుంచి రు. 10-0-0 చందాగా తీసికొని, రూపాయకు రెండుఅణాలు హెచ్చింపు ప్రకారం మొత్తం రు. 11-4-0 ల వెలగల గ్రంథాలు క్రమంగా అందిస్తాము.

మీరు మా గ్రంథమాల కృషిని గుర్తించి గ్రంథమాలకు చందాదారులై మమ్ము ప్రోత్సహించాలని కోరుతున్నాము.

విన్నవించు

వట్టికోట ఆళ్వారుస్వామి

స్థాపకుడు, ప్రకాశకుడు.